# భారత మాత సేవలో

వైకుంఠ ఏకాదశి
యువనామ సం॥ పుష్యమాసం
1 జనవరి 1996

**ప్రచురణ :**
నవయుగ భారతి ప్రచురణలు
3-4-705/4, నారాయణగూడా
హైద్రాబాద్ - 500 029

**లేసర్ టైప్ సెట్టింగ్ :**
జాగృతి గ్రాఫిక్స్
నారాయణగూడా - హైద్రాబాద్

**ముద్రణ :**
భారతి ఆర్ట్ ప్రింటర్స్
1-8-74/2, చిక్కడపల్లి
హైద్రాబాద్ - 500 020

**ప్రతులకు :**
సాహిత్యనికేతన్
3-4-852, బరకత్ పురా
హైద్రాబాద్ - 500 027

సాహిత్య నికేతన్
ఏలూరు రోడ్
విజయవాడ - 520 002

వెల. 12/-

# పీఠిక

ఆర్యులారా! ఓ పరమార్థతత్పరులారా!! ఆస్తికులారా!!! మహానుభావుండగు భర్తృహరి యంతటి మహాకవీశ్వరుండు కూడ సదుపదేశంబును గ్రహింపని యీ మూఢ ప్రపంచమునకు సద్విషయంబుల బోధించుటయం దెంత శ్రమపడినను "చమురుఖర్చే కాని బిడ్డ బ్రతుక"దను సామెతగ నిరుపయోగంబని నిశ్చయించుకొని

"శ్లో. బోద్ధారో మత్సరగ్రస్తాః
ప్రభవస్స్మయ దూషితాః
అబోధోపహతాశ్చాన్యే
జీర్ణమంగే సుభాషితం.

భావము

పరులచే నుపదేశింపఁబడిన సద్విషయంబును దెలిసికొనఁజాలినవారు "ఒకఁడుపదేశించువాడా! మేము వినవలసిన వారమా! అను నసూయచేఁ గూడినవారగుటచేతను, ప్రభువులు గర్వముచే నొడలెఱుంగని వారగుటచేతను, ఇతర మానవులు తెలిసికొనలేనంత యసమర్థతతోనున్న వారగుటచేతను, ఉరోపదేశంబులను జక్కఁగ వినకుండిరి. కావున నా మంచి మాటలు వెల్లడింపను. నాయందె యిముడ్చికొందును" అని యర్థము గల యొక శ్లోకంబును జెప్పి ప్రపంచంబున కుపదేశించుటలో విరక్తి జెందినట్లు కనుపట్టుచున్నది,

ఇది యిట్లుండ నావంటి యల్పజ్ఞుండిట్టి పనికి సిద్ధపడుట కేవలము హాస్యాస్పదమని నే నెఱుంగకపోలేదు. అయిన నొక్కొక్క మనుష్యున కొక్కొక్క పనియందు వేగమధికంబుగ నుండును. ఆ వేగమా మానవుని దత్కార్యంబున బలవంతంబుగఁ బ్రవేశపెట్టి కొన్ని కష్టంబులనో; సుఖంబులనో యనుభవింపఁజేసికాని శాంతింపదు.

కావున నేను బంగారమను పేరుతోఁ గొన్ని పద్యంబుల వ్రాసి ప్రపంచము కేవలము గ్రుడ్డిదికానిచో, నివి నీతి బోధకంబులు కాకపోవనియు నా ప్రయాసము కొంచమేనియు సఫలము కాకపోదనియు దృఢముగ విశ్వసించి యీ పద్యంబుల కుపోద్ఘాతము వ్రాయుటూని "వడ్లు వందుమును బిచ్చుకలు ముప్పందుము" ననునట్లు గ్రంథంబుకంటె నవసరంబు ననుసరించి దీనిని విస్తరింపఁ బోవుచున్నందులకుఁ బండితులు మన్నింతురుగాక!

"కోటివిద్యల్లు కూటికొఱకె" అను నార్యోక్తి పూర్వమట్లె యుపయోగపడినదేమో కాని రానురానట్లు కాక "అనేక కోటి విద్యల్లు బహుకోటి దురభ్యాసముల" కను విధముగ మారినది. అట్లు కాదేని

శ్లో. అనారోగ్య మనాయుష్య
మస్వర్గంచాతి భోజనం
అపుణ్యం లోకవిద్విష్టం
తస్మాత్తత్పరి వర్జయేత్.

## తాత్పర్యము.

అతిభోజనము వలన ఆరోగ్యమును, ఆయుష్యమును, పుణ్యమును బోవును. స్వర్గము రాదు. లోకముతో విరోధము వచ్చును. కావున నెవ్వఁడు నతిభోజనము చేయకూడదు. ఆకలి తీరునంతవఱకె భుజింపవలెను.

శ్లో. జీవనాదధికం గృహ్ణన్నరోయాత్యధమాంగతిం.

## భావము.

జీవనముమాత్రము జరుగుటకంటె నెక్కువ సంపాదించువాడు నరకలోకంబును బొందును.

శ్లో. అసాధినోగృహాచ్చైవసాభికాలాచ్చభోజనాత్
అచ్ఛిద్రవసనాద్జ్ఞానాద్భూయయిచ్ఛన్వ్రతత్యధః.

## తాత్పర్యము.

ప్రతి మనుష్యుఁడును వర్షము నాపుటకుఁ జాలినంత కొంపను, ఆకలి శాంతింపఁ జేయుటకు మాత్రమే తగిన యన్నమును, చినుగకుండుట మాత్రమే లక్షణముగాఁ గల గుడ్డను, మోక్షసాధనమగు జ్ఞానమును గోరవలయును గాని యంత కెక్కువ గోరినచోఁ బాపలోకంబునఁ బడును.

అని పరాశరమన్వాది ధర్మశాస్త్రంబులు ఘంటాపథంబుగ ఘోషించుచుండ జనులు వీనిని దృణప్రాయంబుగఁ దిరస్క

రించి కేవలము కూటికొఱకును గుడ్డ కొఱకును గాక యున్మత్త తచేఁ గేవల భోగపరాయణులై పరమార్థదృష్టి నించుకంత యెఱుంగక యిహలోకంబె శాశ్వతంబని తలంచుచు మూర్ఖలోక స్తోత్రంబులకు లొంగి తామె లోకంబున సర్వసంపత్సంపన్నుల మను బిరుదంబు నార్జింపఁ గోరి కిందుమీఁదెఱుంగక కీర్త్యప కీర్తులం బాటింపక ధర్మాధర్మవిభేదంబులం గనక పైకిఁ గేవల దురభ్యాసంబులవలెఁ జూపట్టక సదభ్యాసంబులవలెఁ జూపట్టు మహాగృహంబులకొఱకును, ధనకనకవస్తువాహనాదులకొఱకును, అమూల్య వస్త్రంబుల కొఱకును, వివాహాదులయందు మహోత్స వంబుల కొఱకును, అతిభోజన ప్రతిభోజనంబుల కొఱకును, కేవల దురభ్యాసంబులగు జూదమాడుట, కల్లుదాగుట, చుట్టలం గాల్చుట, పొడుముఁ బీల్చుట మొదలగు కార్యంబులకొఱకును దుర్వృత్తులం బ్రవేశించుచుఁ, బర ద్రోహైక పరాయణులై, విత్తార్జనంబె ప్రధానంబని తలంచుచు, ననేకులు చెలరేగి భయ భక్తులు వదలి యేల తిరుగవలయును?

ఏవి లేకపోయిన జీవయాత్ర జరుగకపోదో? యేవి పరా పరహింసలం గలిగించునో? యేవి యిహపర లోకంబులకు హాని కరంబులో? యవి దురభ్యాసంబులనియు, ఏవి లేకపోయిన జీవయాత్ర జరుగదో? ఏవి పరాపరహింసలం గలిగింపవో? ఏవి యిహపర లోకంబులకు హానికరంబులు కావో? యవి సదభ్యాసంబు లనియుఁ జెప్పఁబడును.

ఇది యిట్లుండ

శ్లో. ఆశాయై యేదాసాసై దాసాస్సర్వలోకస్య
ఆశాదాశీయేషాం తేషాం దాసాయతేలోకః

తాత్పర్యము.

ఎవ్వఁ డింద్రియ నిగ్రహము లేక భోగ భాగ్యంబులను గోరునో? వాఁడు ప్రపంచంబునకంతకును దాస్యంబుఁ జేయ వలయును. అనగా నెల్లవారికిని లొంగి యుండవలయును. ఎవ్వఁడు భోగ భాగ్యంబులను గోరడో? వానికి సర్వజనులు లొంగి దాస్యము చేయుచుందురు.

శ్లో. వేదాద్వేధాభ్రమంచ క్రేకాంతాసుకనకేషుచ
తాసుతేష్వవ్యనాసక్తో సాక్షాద్భర్గోసరాకృతిః.

తాత్పర్యము.

ప్రతి మనుష్యునకును బ్రహ్మదేవుడు స్త్రీలు, బంగారము అను రెండు వస్తువులయందు విశేషముగఁ గోరికను గలిగించి నాడు. ఈ రెండు వస్తువులయందును గోరికలేని పురుషుఁడు శంకరునితో సమానుఁడు. అనగా నీశ్వరుని యంతటి మహానుభావుఁడు.

పైని వ్రాసిన శ్లోకంబులను బట్టి యాశకు లొంగనివారికి సర్వజనులు లొంగుదురనియు, కాంతాకనకంబుల యందుఁ గోరికలేనివాఁడు శంకరునితో సమానుఁడనియుఁ దెలుచున్నది. గొప్పతనంబు లన్నిఁటికంటెను సర్వజనులను దనకు లోఁబఱచు కొని యీశ్వర సమానుఁడని యనిపించుటకంటె గొప్పతనంబు

లేదు గద? కానఁ గాచ సమానంబులగు నితరాధిక్యంబులం ద్యజించి యీ మహాధిక్యంబును సంపాదింపఁ బురుషుఁడు ప్రయత్నింపరాదా? అయినను నిందు: బూర్వార్థంబగు కాంతపై నాస వదలవలయు ననుటలోఁ జాలఁ గష్టంబును ప్రయోజన భంగంబును గలుగుచున్నవి. ఏలయందురా? స్త్రీని గేవల కామోప భోగార్థంబుగ స్వీకరించుట మహా దోషమని యొప్పుకొనక తప్పదు. కాన నందుకొఱకుఁ గాకపోయినను "తిష్ఠ కుదిరినగాని నిష్ఠ కుదుర" దను సామెతగ జీవనాధారంబగు నాహారాదికంబు లేకున్న మోక్షప్రాప్తికై తపశ్చర్యాదికంబును, సత్కార్యచరణంబును నెరవేర్చుటకు వీలుపడదు. కావున నట్టి యాహారాదులను బచనము చేసి సమకూర్చుచు నిత్యోపచారంబుల నాచరించుటకును నవిలఘ్యంబు లగు నాగంతుక రోగ జరాది దోషంబులు శరీరంబు నాశ్రయించి పీడించినప్పుడు నరుం డశక్తుండయి యితర సాహాయ్యంబు నపేక్షింపవలసి వచ్చినప్పుడు తగు సాహాయంబు నాచరించుటకును, నిదిగాక "అపుత్రస్య గతిర్నాస్తి" అను వచనప్రకారము పుత్రులు లేనివారికి సద్గతులు గలుగవు గాన నట్టి పుత్రులను బడయుటకొఱకును, కనుకనే రఘువంశపు రాజులను వర్ణించు నప్పుడు "ప్రజాయై గృహమేధినాం" సంతానము కొఱకే భార్యాస్వీకారము జేయువారనియుఁ గామముకొఱకుఁ గాదని యును గాళిదాసుఁడు వరించి యున్నాఁడు. ఈ సద్గతి

సదుపచారంబులకొఱకు సవృత్తిన్ స్వీకారము తప్పదని యని
కొందఱు. మఱియొక విధమున సద్గతి సదుపచారంబుల నొందఁ
గలుగువారది గూడఁ దప్పించుకొనవచ్చును. అయినను
గొందఱిట్టి నష్టముల శంకింతురేమో యని యిది మాత్రము
తప్పదని వ్రాసితిని. ఏ కార్యమున కుపయోగపడక పోవుటయే
కాక పైఁబెచ్చు సకలానర్థ కారణంబును, సర్వపాప హేతువును,
సకలప్రయాస సాధ్యంబునగు బంగారంబు నేల కోరవలయునో?
ఇది కేవలము నింద్యమని యెఱింగినవారు జగంబున లేరు
గాఁబోలు. అట్లన నేల? బంగారంబు సౌందర్య కారణంబు
కాదా యని కొందఱు మందమతు లనవచ్చును. నిజముగ నది
సౌందర్యంబు నీయఁజాలదు. అయినను "పదుగురాడు మాట
పాటియై ధరఁజెల్లు" ననునట్లు మందమతులైనను బదుగు
రంగీకరించిన దానిని కాదని యొప్పించుట మహాప్రయాస
కరము. కాన "తుష్యతుదుర్జన న్యాయంబున" నట్టి స్వల్ప
ప్రయోజనంబు నంగీకరించినను నిట్టి స్వల్పోపయోగంబును
గోరి మహానర్థకంబు బంగారంబును గోరుట తప్పని బుద్ధి
మంతులు చెప్పకయే గ్రహింపకమానరు. ఇట్టి తుచ్ఛ బంగా
రంబునం దాశ వదలి యీశ్వర సమానత్వంబు నార్జింపరాదా?
సకల కష్టంబులంబడి బంగారంబు నార్జించి సామాన్య మానవు
లతో సామ్యంబు సంపాదించుటకంటె నే కష్టములు లేకుండ
సంభవించు నీశ్వర సామ్యంబు నార్జించుట బుద్ధిమంతులకు
లక్షణంబు గదా? ఇట్లాచరింపకపోవుట దురభ్యాసము కాదా?

అయినను "గతానుగతికో లోకోనలోకః పారమార్థికః" లోకము వెఱ్ఱినవాని ననుసరించును. అనగా "నొకఁడెట్లువేసిన నట్లు చేయునదే కాని పరమార్థంబు నాలోచింపదు" అనునట్లు పండితులు, పామరులు, మహారాజులు, నిరుపేదలు, వారు వీరననేల? సకల మానవులు నేమి వింతయో? యేమి పాపమో కాని యీ హేమవ్యామోహంబునఁ జిక్కి సకల బాధల సకల పాపంబులఁ బడుచున్నారు. ఇట్లేల పడవలెనో? ఇందుకుఁ గారణ మాపరమాత్మయే యెఱుంగు గాక!

కావున నో యాస్తికులారా! పైని వ్రాసిన పరాశర మన్వాది ధర్మశాస్త్రంబుల సూక్ష్మదృష్టితో నాలోచించి యాకలిని దీర్పఁజాలు నన్నంబుకొఱకును, శరీరంబును గప్పఁజాలు వస్త్రంబుల కొఱకును, వర్షాతపంబుల నుండి రక్షించు గృహంబుల కొఱకును న్యాయపథంబున నార్జించుకొనుచు నట్టి వాఁడె ప్రయోజకుండనియుఁ బుణ్యాత్ముఁడనియు వట్లుకాక తమకొఱకును, తమ పుత్రుల కొఱకును, తమ కుమారుల కొఱకును, మనుమలకొఱకును, మునిమనుమలకొఱకును, ముని మనుమల మునిమనుమల కొఱకును, నింకఁ దొంబదితొమ్మిది తరంబులకొఱకును బనికిమాలిన వ్యయమాచరించుటకుఁ జాలదను దురూహలతో దుర్వృత్తులంబడి బంగారంబు నార్జించుటయే ప్రధానంబని యనికొని సంపాదించువాఁడు పాపాత్ముండనియు, నప్రయోజకుండనియు, నజ్ఞాని యనియు నిశ్చల బుద్ధితో నిశ్చయించుకొని పరదార పర ధనాదులం గోరక, యనృతైక జీవనులు గాక పరహింసల నాచరింపక వేద

బాహ్యాలు గాక దయాసత్య శౌచంబుల యందె ముఖ్యంబుగ నాదరంబుగలవారయి యెట్టివాఁడు ప్రయోజకుఁడో? యెట్టివాఁడప్రయోజకుఁడో? యందలి సత్యాసత్యంబులఁ జక్కగఁ దెలిసికొని తుచ్ఛభోగంబుల కాశపడి దురభ్యాసంబులకు నలవాటుపడక మూర్ఖజన స్తుతులకు లొంగక యుభయ లోకంబులకుం జెడక పరమార్థతత్పరులై ప్రవర్తింతురు గాక యని మిమ్ముల బహువిధంబులఁ బ్రార్థించుచు బంగారంబును గుఱించి నేను వ్రాసిన విషయంబులఁ నసూయావిరహితులై సూక్ష్మ దృష్టితోడను, నిశ్చల చిత్తంబుతోడను, శాంతముతోడను జక్కగఁ బరిశీలించి గుణదోషంబుల గ్రహింతురుగాక యని ప్రార్థించుచు విరమించుచున్నాఁడను.

ఓ తల్లులారా! స్త్రీరత్నంబులారా!

శ్లో. "జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్రత్నమితికథ్య తే"

అని మానవ జాతియందు స్త్రీ యుత్తమతమయయినది కనుకనే మీకు స్త్రీరత్నంబులని పేరు వచ్చినది. కావున సమయము వచ్చినప్పుడు మీరు మీ యుత్కృష్టతను నిలుపుకొనవలయును. అట్లు నిలుపుకొననిచో మీ పేరు నిలువదు. పోయిన తరువాత పేరు మరల వచ్చుట దుర్లభంబు. "కాంతాసు కనకేషుచ" అని బ్రహ్మ పురుషునకుఁ గాంతపై ననురాగంబు ముందు సృజియించి, యనంతరంబు కనకంబుపై నాశ కలిగించినాఁడు. అనగాఁ గనకంబుపై నాస పురుషున కెందుకనినఁ

కారణంబు. దశరథుండు రాముననరణ్యంబునకుఁ బంపుట యను నధర్మంబునఁ బ్రవర్తించుటకు భార్యయే కారణంబు. సత్కాంత లభించిన సౌఖ్యంబును దుష్కాంత సంభవించిన దుఃఖంబును భర్త యనుభవింపక తప్పదు. స్త్రీ యాభరణంబుల సమర్పించిన భర్తను మహారాజుగను, ఆభరణంబుల నొసంగని భర్తను భృత్యుఁడుగను జూచుటచేఁ బురుషుండాభరణంబులకై ప్రయత్నింపవలసి వచ్చుచున్నది. పాపవృత్తులచేఁ గాని బంగారంబు రాదుగదా? కావునఁ బురుషుండొనరించు పాపంబులకు మీరు కారణంబగుచున్నారు. ఇట్టి యపకీర్తిని మీరేల పొందవలయును?

ఇదియునుంగాక యింకొక యనర్థంబుకూడ సంభవించుచున్నది. అదియేది యందురా? బుద్ధిమంతురాండ్రగు నొకరిద్దరు స్త్రీల నటుండనిండు. సర్వసాధారణంబుగఁ బెక్కండ్రు స్త్రీలు సాటివారలలో నగలు లేకపోయిన గౌరవ లోపంబని తలంచి యట్టి తుచ్ఛాభరణంబులంగోరి, వృద్ధుని, దుర్గుణవంతుని, విద్యావిహీనుని, దుర్బలుని, దుదకంగ హీనుసైన వివాహమాడవలసిన వారగుచున్నారు. ఇట్టి యనర్థంబులకు మీరేల వశులగుదురు?

నగలయందు దృష్టిని మరలించినచోఁ బ్రతి స్త్రీకిని దన భర్త మహారాజుగఁ దోచును. సర్వసౌఖ్యంబుల నొసంగుచున్నట్లు తృప్తిగలుగును. మీరు ధర్మముపదేశించినఁ బురుషుండు ధర్మమునే చేయును. అధర్మ ముపదేశించిన నధర్మ

మునే చేయును. మూర్ఖురాండ్రగు స్త్రీల నట్లుండనిండు. బుద్ధిమంతురాండ్రగు స్త్రీలు తమ భర్తలను జేతిలోని కీలుబొమ్మల వలె నాడింపకమానరు. గుణదోష విచారణంబును జేయఁజాలు నొకరిద్దరు పురుషులేమో కాని సర్వ సాధారణంబుగ మీరు సెప్పినట్లు సంచరించుచు మీ సంతోషంబునకై ప్రవర్తించు పురుషులను మీరేల ధర్మ పదంబునఁ బ్రవర్తింపఁ జేయరు? మీకేల దయరాదు? మీరు బంగారంబు కావలయు నన్నఁ బురుషుఁడట్లే పాటపాడును. మీరు బంగారంబు వలదన్న, బురుషుండట్లే తాళము వేయును. కావున "ఓ పురుషులారా! మీరు బంగారంబు నార్జింపకుండిన మే మనుగ్రహింతుము. ఆర్జించిన మేమాగ్రహింతుము" అను మంత్రంబు నుపదేశింపుఁడు. అప్పుడొక పురుషుండైనను బంగారంబు నపేక్షించునేమో? చూతము.

ఇదిగాక తత్వంబు నాలోచింప ద్రవ్యంబు సంపాదింప వలయునను కోరిక కలుగుట కంటె ద్రవ్యంబు నార్జింపఁ గూడదను కోరిక కలుగుట దుర్లభంబు. అట్లు కాకున్న నెంత ప్రయత్నించినను ద్రవ్యంబు నార్జింపకుండుట యందు బుద్ధి ప్రవర్తించునేమో? చూడుఁడు. కావుననే లోకంబెల్ల ద్రవ్యార్జనంబునందె ప్రవర్తించుచున్నదిగాని మానుటయందుఁ బ్రవర్తింప లేకున్నది ఏది గౌరవహేతువో! యేది పుణ్యప్రదమో! దానిని జేయుట దుర్లభంబుకాదా? అట్లె నగలు ధరింపవలయునను కోరికలు గలుగుటకంటె ధరింపరాదను వ్రతముఁ బూనుట

యశక్యంబు. కావుననే దాసిమొదలు రాణివఱకును నగు స్త్రీ జనం బలంకార ధారణంబు నపేక్షించుచున్నది గాని తన్ని వృత్తి నభ్యసింపలేకపోవుచున్నది. అందఱు నభ్యసించుచున్న దాని నభ్యసించుటలో గౌరవకీర్తు లేమి కలవు?

గీ. అనపహార్యంబు తేజోమ। యంబు సకల
గుణములకు నలంకారంబు। గురుతరంబు
భామలకుఁ బతిభక్తి య। పరమమైన
భూష భూషణంబులె? పెర। భూషణములు.

దొంగిలింప శక్యముకానిదియు, మిక్కిలి కాంతికలదియు, అన్ని సుగుణంబులకును భూషణమయినదియు, గౌరవకారణం బయినదియు నగు పతిభక్తియె స్త్రీలకు ముఖ్యమయిన నగ. మిగిలిన నగలు నగలు గావు. అనగా మిగిలిన నగ లుప యోగము లేనివి. పనికిమాలినవి. వ్యర్థములు.

అని బుద్ధిమంతు లగు పండితులు చెప్పినట్లు స్త్రీలకుఁ బాతివ్రత్యమే మహాభూషణము. దానిని మించిన మహా భూషణము లేదని మీరు నిశ్చయంబుగ నమ్ముఁడు. కావున నోతల్లులారా! నా మాటలను వెఱ్ఱి మాటలుగఁ దలంచి నిర సింపక బంగారంబను పేరుతో నాచే వ్రాయ బడిన పద్యంబులఁ జక్కగఁ బరిశీలించి యందలి రహస్యంబును గ్రహించి ధర్మ సూక్ష్మంబును దెలిసికొని తక్షణమే మీరు మీ కనకాంభర ణంబులఁ బరిత్యజించి బంగారంబునకు మూల్యంబుఁ బాపి

మీ శరీరంబులఁ బాతివ్రత్య భూషణంబులచే నలంకరించుకొని చూచుకొనుఁడు. అప్పుడు మీరెంత సౌందర్యవంతులుగ నెంత సుఖవంతులుగ నెంత శాశ్వత కీర్తివతులుఁగ నుందురో? యొరులు సెప్పకయె మీరే గ్రహింపఁగలుగుదురు. కావున మీరు ముందుగ బంగారంబుపై నాశ వదలి మీ యనుగ్రహంబును గోరు మీ పురుషులకై సదుపదేశంబులం జేసి బంగారంబుపై బుద్ధిని మాన్పి దేశోద్ధరణంబు గావించి లోకాతీతంబులైన శాశ్వత కీర్తి గౌరవంబుల నార్జింపుఁడు. బంగారంబునకు మూల్యంబు లేకుండఁ జేయుఁడని మీకు వందన శతంబుల సమర్పించుచు విరమించుచున్నాఁడను.

ఇట్లు
వేదుల సూర్యనారాయణశాస్త్రి,
కాకరపఱ్ఱు, తణుకు తాలూకా.



# బంగారము

సీ. భూమిపాలించెడు • భూపాలకుఁడు నీవ?
నరనాథుఁగొల్చు కిం • కరుఁడు నీవ?
ఆగమంబులనేర్చి • నట్టి శాస్త్రియు నీవ?
కొతుకునిరక్షర • కుక్షి నీవ?
విశ్వమెల్ల జయించు • వీరవీరుఁడు నీవ?
పిచ్చుకకు న్జంకు • పిరికి నీవ?
ధనధాన్యములు గల్గు • దానశౌండుఁడు నీవ?
భిక్షమెత్తెడు నిరు • పేద నీవ?

గీ. అఖిలమీవ? నీకంటె న • న్యంబులేదు
కాన న్యూనతాధిక్య సం • కల్పమఁడచి
యుడిపి భేదభావము దేశ • ముద్ధరింపు!
మైక్యముగలిగి వెలిగి యో • యాదిదేవ!

గీ. అఖిలశాస్త్రంబులందున్న యర్థమెల్లఁ
దెలియఁజెప్పెద స్త్రీలార! • తెలిసికొనుఁడు
భర్తృనానతి తలఁబూవు • వలె ధరించు
కాంతలకుఁ గీడు లెందును • గానరావు.

*గీ. తల్లి లాంగలాగ్రమున నం • తంబునొందె
నంతమొందె సుతుండు వి । ష్ణన్నభుక్తిఁ

---

కథ

* ఒక శూద్రుఁడు తన పొలమును దున్నుకొనుచుండగాఁ నాగఁటిచాలులో నొక కాసులబిందె దొరకెను. అట్లు దొరకుటను

గొడుకునకుఁ దల్లికిం బగ । గ్లూర్చునట్టి
కనకమా నీకు నొక నమ । స్కారమమ్మ?

సీ. అబ్బించెదవుగదా । వ్యభిచారభావంబు
పతిదైవమను పతి । వ్రతలకైన
అనిపించెదవుగదా? । యనృతవాక్కుల నోట
సత్యంవదేత్తను । జనులకైన
ద్రోయుచుండుదువుగదా । దొంగతనాలలోఁ
జోరత్వ మెఱుఁగని । సురలకైన

---

దల్లికూడ జూచెను. "తల్లి బ్రతికి యుండినఁ గొంత భాగ మీయక తప్ప" దని కుమారుఁడును, కుమారుఁడు బ్రతికి యుండిన "నంతయుఁ దానే పుచ్చుకొందు" నని తల్లియుఁ దలంచి యొకరి నొకరు చంపఁ బ్రయత్నించిరి. అంతఁ దల్లి కుమారునకు విషము కలిపిన యన్నమును దెచ్చి చెట్టుక్రింద నలవాటు ప్రకారము పెట్టుచుండగా "నిదియే సమయ" మని కుమారుఁడు నాగఁటితోఁ దల్లి తలపైఁగొట్టి చంపెను. తరువాతఁ గుమారుఁడు "తల్లి చచ్చెన" దని సంతోషించి యా యన్నమును దిని తానుకూడఁ జచ్చెను. అంత నా ధన దేవత యీ సంగతిని జూచుచుఁ బోవుచున్న యొక మార్గస్థుని జూచి "నన్ను నీవు తీసికొని పొమ్మ" ని చెప్పగా నా మార్గస్థుఁడు దాని నపేక్షింపక యీ పద్యార్థము గల యొక సంస్కృత శ్లోకమును జెప్పి వెడలిపోయెను.

గూల్చుచుందువుగదా? కోర్కుల సర్వసం
గత్యాగులైనట్టి । ఘనులనైన

గీ. ఇట్లు వర్ణింపనేల? । నిన్నెంతయెంత
వారిచే నైన నేలాటి । పనులనైన
నటులచేయించి తీరుదు । వంతలోనఁ
దల్లిబంగారమా? నీవు । దలఁచికొనిన॥

ఉ. ఆకటిఁ దీర్తువా? రస । నయారినవట్టున దప్పిదీర్తువా?
మూకతనంబు? మాన్పుదువ? మోక్షమునిచ్చెదవౌక్కొసద్గుణా
నీకములేవి? నీకడ జ । నించినవున్నవొ? చెప్పచూతమో
సీ? కనకమ్మ? కోరుదురి । సీ? నిను నల్పులు వారుకారొకో?

శా. చోరత్వంబొనరింతిసీ? యనృతవా।క్రూరత్వముం
గొందిహో
జారత్వంబునకుఁ భయంపడరు త్వా।త్సంపాదనోద్వర్తనుల్
నీరాకల్పహుదుఃఖజాలములఁగ । ల్గించుస్పుఖంబౌల్చ బం
గారంబాయిదియేమిపాపమొకో?నిశ్గాంక్షింపరేవారలున్.

గీ. కొట్టుకొని చత్తురమ్మ? నీ । కొఱకుఁ దల్లి?
యేమిసుఖము బంగారమా? । యిడుదువొక్కొ?
వెట్టివారలు భూమిలో । వెలసినపుడు
కానివారలకే గల్గు । గౌరవంబు.

సీ. చూడనీయవుగదా । సూక్ష్మయత్నాలభ్య
పరమాత్మతత్వ సం । పత్ఫలంబు

పొందనీయవు గదా? • పూర్వకాలాగత
ప్రాణబంధుత్వ సం • బంధగరిమ
కాననీయవుగదా? • గౌరవకీర్తి ము
ఖ్యాధారనిత్య స • త్యవ్రసక్తిఁ
గలుగనీయవుగధా? • కాలోచితపదార్థ
నిద్రానుభవలభ్య • నిరతసుఖము

గీ. పట్టి వర్ణింపలేకపోఁ • బట్టికాని
యొక్కసుగుణంబయినను లే • దున్నవన్ని
దుర్గుణంబులె? నీకడ • దొరలుచుండు
సత్యమన స్వర్ణమా? యేమి • జంకు? నాకు

గీ. ఐన దూరదృష్టి సెఱుఁగ । కజ్ఞులెల్లఁ
బ్రాకులాడుచు నుంద్రు నీ । ప్రక్కఁజేరఁ
జిత్రమే మొ? బంగారమా? చెప్పవలెనె?
నూర్గురంధులు కనలేక । నూతఁ బడరె?

సీ. తలనొప్పిపోవునే? తనకు నాగరమున్నఁ,
బోవునే చెవిపోటు? పోగులున్న
ముక్కముందరఁ బెద్ద । ముంగరజేర్పంగ,
శింఘాణకారంబు । చేరకున్నె?
కాసులు కంటెలు । కంఠంబునందున్నఁ,
గంఠార్తి పోయి సౌ । ఖ్యంబులగునె?

కాళ్ళకందెలు గల్గఁ। గాల్కడు పోవునే?
కరపీడ లడఁగునే? కంకణముల

గీ. మోత దండుగ మిము మోయు । మూర్ఖవనిత
లీ రహస్యంబు గనలేక । యిట్టులట్లు
దుఃఖపడుదురు మిముఁగోరి । దోషమనక
బంగారు వగలార! యెదొ? మీ । భాగ్య మెఱుఁగ.

సీ. సంపంగి పువ్వుతో । సరివచ్చు ముక్కుకు
మోటు భారిన । ముక్కుపుడకలేల
శ్రీకారమును బోలు । చెన్నారు చెవులకు
మోటుబారిన మొద్దు । దుద్దులేల
యుండియు లేనట్టు । లుండెడి నడుమున
కరచు వడ్డాణంబు । కట్టె ఏల
పాదపంబులఁబోలు । పాదయుగంబున
అందెల కడియాల । బంధమేల

గీ. సహజ సౌందర్యవతులకు । సంభవించు
నంద మాభరణములచే • నయ్యె ననుచు
దలఁచుచున్నారు కాఁబోలు । ధరణి జనులు
పట్టి పరికింపఁగా నిది । వట్టికల్ల

సీ. సత్యంబునకు హరి • శ్చంద్రుండు నిన్నెగా
కిచ్చె రాజ్యము కాశి • కేగునాఁడు

అలాగె శ్రీరాముఁ • డాచరించెను తండ్రి
మాటపై నడవుల • మనలునాఁడు
సీతామహాదేవి • సేఁ జేత విడనాఁడె
భూషల లంకకుం • బోవునాఁడు
సావిత్రి త్యజియించె • స్వర్ణభూషణముల
భర్తృసేవ యొనర్ప • వచ్చునాఁడు.

గీ. ఆదరింతురెగాక? నిను నొ । కప్పు డెటులొ?
తగు నవసరంబు వచ్చిన । తరుణమందు
నెంద ఱెందరు పూరుషు । లింతులట్లు
ని న్విసరిరి బంగారమా? నిజము పల్కు.

గీ. జ్ఞాన వైరాగ్య సంపద । గ్గలుగువార
లెవ్వరు పసిఁడిని జ్జేర । నిచ్చినార
లమృత సారంబు గోరెడు । నమర వరులు
భక్తిఁ ద్రాగ దురొకొ? చింత । పండు పులుసు.

గీ. మిమ్ముఁ దాల్పంగ నందంబు । గ్రమ్ము ననుచుఁ
గొంద ఱనుకొందురె నగలార! । యుందుఁ గల్గు
సూనృతానృత విషయంబు । సూక్ష్మ దృష్టిఁ
గనవలయు నది సామాన్య । జనుల కగునె?

గీ. ఆభరణము ల్వికారంబు । నడఁచివైచి
యతుకు సౌందర్యము వికృతా । కృతుల కంచుఁ

గొంద రనుకొంౘదు గాఁబోలు । మందమతులు
పట్టి శోధింప నిదియును । పట్టికల్ల.

గీ. అవధి లేకుండ నగల వ్రే । లాడఁగట్టి
యొకతెఁ గుత్సితాకార నిం । కొక్కదాని
సహజ సౌందర్యవతిని భూ । షణ విహీనఁ
దెండు కనుఁడంద మెచటనో? । తెలు నిపుఁడె?

ఆ. అందకత్తె లిరువురందు । సౌందర్యంబు
నగలు గల్గు దాని । కగునటంచు
భ్రాంతి పడకుఁడేల? పరిమళంబీఁజాలు
మల్లెపూలకుఁ బెర । మాఱిను పూలు.

గీ. ఫలిత సస్యభాసుర మగు । వసుధయందు
దృష్టి బొమ్మలఁ బెట్టిన । తీరుగాగ
నగలు వ్రేలాడఁదీసిన । పొగ సడంగు
సహజ సౌందర్య భాసుర । సతుల కకట?

గీ. అమరిచిన దానిలోపల । నత్త వ్రేలు
పెట్టి నట్లందకత్తెల । వెంటనుండి
యంద మంతయు మావల్ల । నమరె ననుచుఁ
బగ్గెలందురె? నగలార! సిగ్గులేదె?

ఆ. ఉల్లిపూల జంట । నొక్కటి నెత్తాని
నన్య పుష్పయుక్తి । నందఁ గలదె?

యిట్లి రూపహీన । లిర్వురం ద్రొక్కితె
నగలు గల్గుమాత్రి । పొగసు గనదు,

మ. సహజోద్భూత విలాస భాసుర తనూ । సౌందర్యచాతుర్యసం
గ్రహణోద్భ్రాజిత మ్మానినీ ముఖులకు । న్నాద్రిదంత మెక్కింతమీ
సహవాసంబున రూపహీనులకునై । సౌందర్యమీలేరుమీ
రహహా! కావున మీఫలంబునగలా । రా! లేదుపక్షద్వయిన్.

సీ. జన్మసిద్ధ ప్రభా । చారుతా రాజిత
పూర్ణచంద్రిల శౌరు । సూడఁ బడె?
నైజరూప విలాస । తేజః ప్రకాశిత
ధేన్వాది మృగజాతిఁ । దేట గనమె?
ప్రకృతి ప్రభాపాతి । భాసమాన సుకాది
ఖగ సంతతులయందు । పొగసు లేదె?
సహజ సౌందర్య భా । స్వర మహా భ్రూతాది
క్ష్మారుహంబులఁ బొల్పు । గలుగకున్నె

గీ. నగలు లేకుండ వీనికి । పొగసు గల్గె
సహజ సౌందర్య మది ప్ర । జాశికగును
ప్రజల పాపమా? నగలేల్ల? । ప్రజకు మాత్ర
మింత గనలేరె? సతులార! । యిప్పుడైన.

సీ. అఖిల దుఃఖంబుల । కాల వాలంబైన
దుర్గుణ నికరముం । దోల గలవె?

సౌఖ్యంబుఁ దొలఁగించి । సర్వ శక్తుల ముంచు
రోగాల నడుగంటఁ । ద్రొక్కఁగలవె?
ప్రతి నిమేషమునందు । వర్ధిల్లి పీడించు
వార్ధకాటోపంబుఁ । బాపఁ గలవె?
అశనిపాతముఁ బోలి । యంతలోఁ బై బడి
యడఁచెడు మరణంబు । నాపఁ గలవె?

గీ. అహహ! కామాది షడ్వర్గ । మంటఁ జేసి
పాపములఁ బెంచి తన్నుఁ బై । వారిఁ గూడ
యెటులో యేడ్పించుటకుఁ గాని । యేమి లాభ
మగును? బ్రజలార! పల్కుఁడీ । నగల గిగల.

శా. అమ్మా! భారతఖండమా! యిఁక సువర్ణాలంకృతుల్ఛాయన
ర్ఘమ్ముల్ధీరలఁ గోర కమ్మ? యిడలి । న్దవ్వుంగనౌనట్టి వ
స్త్రమ్ముల్ క్షుత్తును దీర్పఁగాఁ దగిన యన్నంబున్గొనంగోరులా
భమ్ము ల్పెక్కులు దేశమందగు సద । భ్యాసంబటుల్గలినన్.

గీ. పరిమళమ్ము లేదు రుచిలేదు । పటుపు లేదు
మార్దవములేదు నీకడ । మహిమ లేదు
కనకమా! యేలకో? నిన్ను । గౌరవింత్రు
ప్రజలు వెఱ్ఱివారలు గారె? । వారు దలఁప.

గీ. కనకమా! యెంత కాలంబు । గర్వపడుదు
వింక సాగవు నీ యాట । లిదిగొ గనుము

కృపాసింధుకు మూతి మీద తొడమీద లోతైన గాయాలు తగిలాయి. కృపాసింధు సాహసంతో మరల పులిమీద గొడ్డలితో వేటు వేశాడు. కొంతసేపు ఈ పోరాటం కొనసాగింది. చివరికి పులి తీవ్రంగా గాయపడి అడవిలోకి పారిపోయింది. ఇంతలో జనం గుమిగూడారు. ఇరవై నాల్గు రోజులపాటు చికిత్సపొందిన అనంతరం కృపాసింధు కోలుకున్నాడు. అప్పటికి కృపాసింధు వయస్సు 12.సం.లు మాత్రమే. పరాక్రమశాలియైన ఇతని సాహసం తోటి బాలురకందరికి స్ఫూర్తి దాయకం. తాను సైన్యంలో చేరిదేశసేవ చేయాలని కృపాసింధు ఆకాంక్ష. వినయశీలి, కర్తవ్య పరాయణుడు, సాహసవంతుడు అయిన ఈ బాలుడిని గౌరవించి సత్కరించటం జరిగింది. అతని మూతిపై ఇప్పటికీ మచ్చలు వున్నాయి. ఈ మచ్చలు ఆ బాలుని ధైర్య సాహసాలకు ప్రతీకలు.

# త్యాగభూమి

బ్రహ్మదేవుడు తన సేవకులను పిలిచి భూమిపైకి వెళ్ళి ఒక్కొక్కరు ఒక్కొక్క కానుక తేవలసింది అని ఆదేశించి పంపాడు. ఆయన చెప్పాడు - 'ఎవరు అత్యంత శ్రేష్టమైన కానుక తెస్తారో వారిని ప్రధాన సేవకునిగా నియమిస్తాను' ఆజ్ఞ ఇవ్వటమే తడవుగా సేవకులందరూ మంచిమంచి కానుకల కోసం అన్వేషిస్తూ భూమండలం మీదకు పరుగుతీశారు. 'నేను అందరికంటే మంచి కానుకలు తీసుకుని రావాలి. నాకే ఉన్నత పదవి లభించాలి', అని ప్రతి ఒక్కరూ ప్రయత్నించసాగారు. ఒకదానికంటే ఒకటి విలువైన కానుకలు తీసుకుని వచ్చి సేవకులు బ్రహ్మదేవుడి ముందు వుంచారు. కాని బ్రహ్మదేవుడి ముఖం మీద ఎక్కడా సంతోషఛాయలు కన్పించలేదు. 'అందరూ వచ్చారా?' అని వాకబు చేయగా ఇంకా ఒక సేవకుడు రావలసి వుందని తెలిసింది. అతని

లుద్ధరింపఁగ జాలుదు । తుచితగతుల
సంచరింప నెట్లెట్లు మో । క్షంబు గనుట?

గీ. ఆ యరుంధతికెవి నగ । లంతమాత్రి
గౌరవార్హ కాదే పెండ్లిఁ । గన్నె లెల్ల
గనక భూషిత గాత్రలఁ । గనక యామెఁ
గాంచినం గాని ధన్యలు । గారు గాదె?

గీ. భూషణాంబరావృతలైన । పూవుబోండ్లు
శతములున్నఁ ద్యజించి దు । ష్యంత విభుఁడు
నగలు లేని శకుంతల । నగని వరించె
నగల? సుగుణంబులా? వ్రిధా । నంబు లచట

గీ. అమ్మలారా! నమస్కృతు । లాచరించి
చెప్పుచున్నాఁడ నొక మాట । చెవి యొసంగి
శ్రద్ధతో విని వినినట్లె । సలుపుఁ డమ్మ
మరల ముమ్మారు మిమ్ము న । మస్కరింతు.

బసిఁడి నగలంచుఁ బులుపాట । పడెద రంతె
కాని యువి యెట్లు వచ్చునో? కానలేరు
వాని కొఱకు మీ నాధులు । పడెడు పాట్లు
కూప కూర్మంబు లట్లు మీ । కొంపలందె

మీరు పడియుంట నెఱుఁగరు । మేలు కోరి
మీకు వివరింతునిఁకనైన । మేలుకొండు

భంగపఱుచు నసత్యము । ల్పలుకుచుందు్రి
జార చోరత్వ పద్ధతి । సంచరింతు్రి.

స్వామి మి్రతా హితంబుల । సలుపుచుందు్రి
పరుల కొంపలఁ గూల్తురు । ప్రాణహాని
మానహాని నొనర్పగా । మసలుచుందు్రి
మోసపుచ్చుచు మాటల । మోయుచుందు్రి

కపట సాక్ష్యంబు లిచ్చుచు । గడ్డితిందు్రి
భ్రూణ శిశు హత్యలను సల్పఁ । బూనుకొం్రదు
తోడ బుట్టుల సొమ్ముల । దోచుకొందు్రి
దేశ భక్తుల నిందించి । తిట్లు తిందు్రి

తప్పు తూనికలం దూచి । ధనముఁ గొందు్రి
లంచముల గొందు్రి పదియైదు । లక్ష కోటి
యన్నదమ్ముల భాగాల । నాక్రమించి
దుఃఖపెట్టుచు దారుల । దోచుకొం్రదు

కపట సాక్ష్యంబు బోధించి । కల్లలందు్రి
గు్రడ్డి గవ్వైన మానక । వడ్డి గొందు్రి
వెఱువక వితంతువులఁ జేర । వెదకి కొందు్రి
తప్పు పద్దుల వ్రాయింతు । రప్పు నిడక

దొంగ నోట్ల వ్రాయింతురు • దురిత మనక
గోడలను గూడ హరియిం్రతు • కుటిల వృత్తి

తండ్రి వ్రాసిన పత్రాలఁ । దప్పుచుంద్రు
సకల పాపకృత్యంబుల । సలుపుచుంద్రు

పుణ్య కార్యంబులను జేయఁ । బూనకుందు
రన్న వస్త్రంబులకె యిట్టు । లాచరింప
వలయు ననుకొనఁ బోకుడు । వాని కొఱకు
న్యాయ వృత్తుల సంప్రాప్త । మయిన ధనమె?

చాలుఁ జాలుటే కాదు వి । స్తార మగును
ధర్మ సూత్రంబుఁ గనుపట్టు । ధన్యుఁ డెవఁడు
భూషణంబులకే యెన్నొ । దోషవృత్తు
లాచరింప వలసివచ్చె । నరసి చూడ

నూరకే వచ్చునా! నగ । లున్నతంబు
లైన మిద్దెలు మేడలు । హర్మ్యములును
బట్టుచీరెలు ముకుమలు । బట్ట లున్ని
శాలువులు మహా మృదుల దు । కూలములును

గుఱ్ఱపుంబండ్లు మోటార్లు । కిఱ్ఱుజోళ్ళు
మునిగి మీ మోహవారాసి । బుద్ధిలేక
చూచి నంతనె మోహాబ్ధి । వైచునట్టి
యిట్టి తుచ్ఛ వస్తువులకె? యెల్ల దోష

వృత్తు లొనరించుచున్నారు । వీని వలన
హేయ నరకంబు లబ్బక । యెట్లు మాను

కావున వివేక వతులయి । కష్ట మనక
యిట్టి తుచ్ఛ వస్తువులును । హేయములగు

నగలు వలదంచు మీరు మీ నాయకులకు
సదుపదేశంబులం జేసి । సాధువృత్తిఁ
గలుగఁజేయుఁడు పుణ్యంబుఁ । గట్టుకొనుఁడు
దీనిచేఁ బ్రజాక్షేమంబు । దేశవృద్ధి

యాయురారోగ్యభాగ్యంబు • లాత్మశుద్ధి
యైహికాముష్మిక సుఖంబు • లగును వినుఁడు
దుష్టు లడుగంటుదురు వోవు • దోష భరము
సజ్జనాళి ప్రజలు నగు • సంఘశక్తి

నెలకు మూడు వర్షంబులు • నిండఁ గురియు
బంటలు సమృద్ధిగాఁ బండు • భవ్యమగును
దేశ దారిద్ర్య దోషంబు • దీఱిపోవు
భుక్తి ముక్తులు సేకూరు । బుద్ధి గలిగి

తల్లులార! యీ లాభము । ల్దలఁచి తలఁచి
పైని చెప్పి నట్లొనరింపఁ । బూను కొనుఁడు
నడుము గట్టుఁడు త్రొక్కుఁడు । న్యాయపథము
కాంత లనుకొన్న కార్యము । ల్గాకపోవు

స్త్రీ తలంచిన కార్యంబుఁ । జేసితీరు
వందనంబులు మీకివే । యందికొనుఁడు.

మ. నగల న్బొత్తిగ దాల్పకుండుటయె మే। ల్నా తల్లులారా! యటు
ల్నగల న్మానుట మంగళేతరము దీ। నత్వంబ నభ్యాసమ
న్వగచేద స్తపుపిచ్చ మీకయినఁద। ద్బాధానివృత్యర్థ మం
తగఁగా కొక్కటొ రెండొ దాల్చియటుపైఁ। దల్లాభముల్గాం
[చుఁడీ

గీ. కల్లు గంజాయి చుట్టలు • నల్లమందు
పొడుము ప్రత్యక్ష నష్టము • లొ్బందఁజేయు
నను చెఱింగియు మానలే • రవని మర్త్యు
లెంత బోధించినను బండి • తేంద్రులకట!

గీ. అంతరానర్థము ల్జేయు • చెంతయేని
పైకి మేల్సేయునట్లున్న • పసిఁడి నిన్ను
విడువ రెంత చెప్పిన జను • ల్విడుచు నేమొ?
కోటి కోఁడ్డైన ననియట్లు • గూర్చినాఁడ.

గీ. సూర్యనారాయణాఖ్యాత • సూరివరుఁడు
స్వీయ పుత్రిక చర్ల సు • శీల యడుగఁ
బొంగి బంగారమను నట్టి • పుస్తకంబు
పేర్మి రచియించి యొసఁగె ధీ • వృద్ధికొఱకు.

[ ం ]